# శ్రీశైల

# శివానందలహరి



సంస్కృత మూలము:

జగద్గురువు శంకరాచార్యులు.

ఆంధ్రానువాదకులు:

**మఱిమఱి గోపాలకవి,** అష్టావధానిగారు.

ధర్మవరం, అలంపూరు తా॥

వెల: ఒక రూపాయి

కీ.శే. శ్రీ మణి మణి గోపాలకవి, అష్టావధాని [ధర్మవరం] గారు తెలంగాణా సుప్రసిద్ధ సంస్కృతాంధ్ర భాషాకోవిదులలో నొకరు. వీరి రచనలన్నియు ముద్రణార్హములే కాక ప్రజోపయోగములని పండితుల యభిప్రాయములు చాటుచున్నవి.

వీరి రచనలు చేసి సుమారు యిరువది సంవత్సరములయినది కవిగారున్న కాలములో ముద్రణ చేయించుటకు యత్నించిరి. కాని వారికి అభ్యర్థనాభంగ భయమేర్పడి విరమించిరి. వారి తర్వాత రచనలన్నియు యే మిఠాయి అంగళ్ళకు అమ్ముడైపోయినవో లేక యెవరైన తస్కరించరో అని అనుకుని నిరాశాపహతుడనైనాను.

అదృష్టవశాత్తు యిటీవల వీరి రచనలన్నియు లభించడముచేత "సిద్ధాశ్రయం సకర్తవ్యం కర్తవ్యం మహదాశ్రయం" అన్న కాళిదాసు సూక్తి ప్రకారము నాకు సుపరిచితులు, జ్ఞానవృద్ధులు, వయోవృద్ధులు, త్యాగమూర్తులు, వితరణశీలురేకాక పరిపాలనాదక్షులు అలంపురము తా॥ పెద్ద తాండ్రపాడు గ్రామ పంచాయతీ అధ్యక్షులు నగు శ్రీ పి. శేషిరెడ్డిగారికడ కేగితిని. సాదర పూర్వకముగా వచ్చినపని యేమిటని విచారించగా "శ్రీ శివానందలహరి" అను పుస్తకమును ముద్రణ చేయు వ్యయభారము వహించుమని కోరితిని. శ్రీ రెడ్డిగారు వెంటనే సరేయని యొప్పుకొని ఆ ముద్రిత పుస్తకమును తీసుకొనిరి. అప్పటినుండి తిరిగి వచ్చునప్పుడు 'మాటతప్పకండి' అని మరియొకతూరి వారికి జ్ఞాపకముచేసి వచ్చితిని.

"మనస్యేకం - వచస్యేకం, కర్మణ్యేకం - మహాత్మనః
మనస్యన్యం - వచస్యన్యం, కర్మణ్యన్యం - దురాత్మనః" అంటే

మనస్సులో ఊహించినది నోటితో చెప్పడము, నోటితో చెప్పినది చేతులతో చేయడము. యిట్లా చరించేవాడు మహాత్ముడు అని, మనస్సులో ఊహవేరు, నోటితో మాట్లాడునదివేరు, చేతులతో చేసేదివేరు. యిట్లాచరించేవాడు దుర్మార్గుడు అని పై శ్లోకార్థము.

మానవుడాశించే దేమిటంటే రొట్టె విరిగినా నేతిలో పడాలని, కులము చెడినా సుఖము దక్కాలని, చెట్టు కొనకొమ్మనుండి జారిపడినా పాలసంద్రములో పడాలని,

ఈ 20 శతాబ్దములో శ్లోకము రెండవ చరణభావమునకు నేరితూగతగ్గ మహానుభావులు నయవంచకులు, వచ్చిమోసగాళ్ళు, దగాకోరులు నూటికి తొంభైతొమ్మిది పాళ్ళు ఉన్నారు. వాండ్లను ప్రగాఢముగానమ్మి పేరాశలకులోనై కాస్త ఉన్న యిండ్లు, వాకిండ్లు, మడి. మాన్యాలు కొన్ని తెగనమ్మి, మరికొన్ని తగులబెట్టి అరణ్యాజ్ఞాతవాసాలు చేస్తూ తుదకు నిరాశజెంది పరువు ప్రతిష్ట, గౌరవ మర్యాదలు వీధిలో పడవేసుకున్న మందభాగ్యులు ఉన్నారు. వారినిచూచి పకపక నవ్వే ప్రపంచమూ ఉంది.

చెప్పవచ్చిందేమిటంటే శ్రీ రెడ్డిగారు ఈ అముద్రిత పుస్తకమును తీసికొని సుమారు ఒకటిన్నర మాసము తనకడనుంచుకున్నారు. యే ప్రెస్‌లోకూడ యిచ్చినట్లగుపడక పోవుటవల్ల యితడుకూడ మాట తప్పుతాడా! అని అనుకున్నాను. కాని వారలాకాక ముద్రణచేయించినారు

కాబట్టి శ్రీ పి. శేషిరెడ్డిగారికి వారి కుటుంబమునకు శ్రీ శ్రీశైల మల్లికార్జునస్వామి భ్రమరాంబా సహితుడై చిరాయురారోగ్య భాగ్యములు ప్రసాదించుగాత యని ప్రార్థించుచున్నాను.

అడిగిన వెంటనే అభిప్రాయములు వ్రాసియిచ్చిన పండిత మహాశయులకు, ఈ పుస్తక ముద్రణ లోపాలను సరిచూచుటకు తమ అమూల్యమైన కాలమును వినియోగించి నాకు కొంత శ్రమతగ్గించిన ప్రియమిత్రులగు శ్రీ వి. శ్రీనివాసులు, టీచర్ [మునిసిపల్ హైస్కూలు, కర్నూలు.] గారికిని, సకాలములో సర్వాంగ సుందరముగా ముద్రించి యిచ్చిన శ్రీ క్రిష్ణా ప్రింటింగ్ ప్రెస్ వారికి నా మనఃపూర్వక కృతజ్ఞతలు అందజేయుచున్నాను. ప్రజలు ఈ పుస్తకముపట్ల విశేషాదరణ జూపుదురని విశ్వసించుచున్నాను.

ఇట్లు

వేముల లక్ష్మణస్వామి, విశారద.

# పండితాభిప్రాయములు.



శ్రీ మణిమణి గోపాలకవి (ధర్మవరం) గారు వ్రాసిన నీతి పద్యములు స్తోత్రములు చూచితిని, శైలి సులక్షణముగాను ధారాశుద్ధి కలదిగాను నిర్దుష్టముగాను ఉన్నది. ప్రామాణికమగు కవితపిరిడి. చక్కని కృషిచేసి సంస్కృత శ్లోకములను తెనిగించి నందులకు ధన్యవాదములు కష్టలు. సర్వదా వీరి శ్రేయస్సును అభివృద్ధిని కోరుతాను.

క్యాతూరు,
15-5-50

ఇట్లు,
సురవరం ప్రతాపరెడ్డి.

కీ-శే. మణిమణి గోపాలకవి కృష్ణా-తుంగభద్రా స్రవంతులచే పావనమైన నడిగడ్డసీమలో ఉద్భవించిన కవిరత్నము, జీవిత మెంతస్నిగ్ధ రమణీయమో భావములంత సౌకుమార్యము లైనవి. భావములకు అన్వివిధమున తగిన రమణీయశైలి సరళ సుందర భాష సమకూడి పసిడికి పరిమళ మబ్బి నట్లయినది.

కవిగారితో కలిసి కవి సమ్మేళనములలో పాల్గొను అవకాశమే గాక సాహిత్య బాంధవ్యముకూడ నాకు కలదు వారితో జరిపిన సాహిత్య గోష్టులు నాకు మధుర స్మృతులు కలిగించు చుండును.

ఆదరించు వారులేని వాతావరణములో జీవయాత్ర సాగించుచును ఆత్మవిశ్వాసము వీడక భగవన్నుతిచే చరితార్థులైన ధన్యజీవులు కవిగారు.

వారి నృసింహ కరావలంబ స్తోత్రము నీతిశాస్త్రము, అచ్చతెనుగు వెంకటేశ్వర శతకము పుష్పబాణ విలాసము, శివానందలహరి, శ్రీరామాష్టోత్తర, శ్రీకృష్ణాష్టోత్తర నామావళులు మొదలైన రచనలన్నియు భక్తిరస పూర్ణములైనవి. అలంపూరు తాలూకా యందలి భాషారాధకులలో ప్రముఖులని చెప్పదగిన గోపాల కవిగారి రచనలన్నియు యిప్పటికైన ముద్రింపబడు చున్నందుకు చాలా సంతోషించు చున్నాను.

సహృదయులును విద్యాపోషకులునగు అలంపూరు తా॥ యందలి ప్రముఖ మహాశయులు ఈ ఉత్తమ కార్యమునకు తోడ్పడి తమధనమునకు సార్థక్యము గూర్తురని ఆశించు చున్నాను.

అలంపూరము,

ఇట్లు, బుధజనవిధేయుడు
గడియారం రామకృష్ణశర్మ

# శ్రీ బా లా - అ భి ప్రా య మ ణి మా లా



శ్రీ మాన్. మణి మణి గోపాలకవిగారి సముఖమునకు.

అయ్యా, మీ రంపిన యముద్రిత పొత్తంబులు స్నేహితుడు చి॥ లక్ష్మణస్వామి వల్ల చేరినవి సమగ్రముగా పఠించితిని. పద్యముల నడక సరళము. గుణరీత్యాలంకార శోభితము. అనువాద సరణి కడుంగడు నిపుణతచే వెలయించినారు. ఆట పాటముద్దు లొలికెడి మురిపెంపు నడకచే యొప్పు తెలుగు పలుకుల పొందిక సలక్షణపద ప్రయోగనైపుణి మున్నగు మేటి కవితా ధర్మసూత్ర పరిపాటిని గమనించి రచనగావించి నందులకు నే మిక్కిలి సంతసించితిని.

1 శివానందలహరి, 2 పుష్పబాణ విలాసము, 3 శ్రీవెంకటేశ్వర శతకము 4 నీతిశాస్త్రము 5 స్తోత్రత్రయము ఈ యనువాదములు-అచ్చుతెలుగు నియమములనెల్ల పరిపాటిలొనున్న లక్షణములనెల్ల శతకరాజమున వెలయించితిరి. తెలగన్న తిమ్మకవుల కావ్యములను పఠించి తత్కావ్య వలనిత పద ప్రయోగముల గుర్తెరిగి వినియోగించు కున్నందులకు నెంతేని సంతృప్తి పడితిని. 1 శివానందలహరి 2 పుష్పబాణ విలాసములు-శంకరుల-కాళిదాస మహాకవుల భావముల వెలితి పడనీయక సొగసైన పదముల ప్రయోగించి పద్యముల్లల్లినారు.

సరిగదా! 3 నీతిశాస్త్రము నానాకవీశ్వరుల శ్లోకానువాదము 4 స్తోత్రత్రయము ఆచార్య శంకరాచార్య గురుపాదుల స్తోత్రముల యనుకృతి ప్రతిభక్తుడు అహరహము పారాయణము గావించునట్టి స్తోత్రరత్నముల 'దేశభాష'లో మీరనువదించితిరి యికమీద మీరు సుభాషితావళి మున్నగు నుత్తమ గ్రంథములను వదించ గలరని నేనాశించు చున్నాను. భగవంతుడట్టి సంకల్పము నెరవేర్చుగాక యని కోరుచున్నాను.

ఇట్లు,

విద్వాన్ గొట్టిముక్కల, చంద్రమౌళిశర్మ,

# మల్లాది సూర్య నారాయణమూర్తి, M. A.

ప్రధానాంధ్రోపన్యాసకుఁడు,

## ప్రభుత్వ కళాశాల. గద్వాల. 15-8-68

తెలంగాణాంధ్ర సోదరులలో చెప్పఁదగిన కవిపండితులే లేరు. వారికి తెను గే సరిగా తెలియదు-అని సర్కారాంధ్రులలో ఒక దురభిప్రాయము ప్రబలి యుండెడిది. మొన్న మొన్నటిదాఁక నేను నట్లే తలంచుచుంటిని. కాని యిటీవల నాంధ్ర ప్రభుత్వమువారి యాదేశము ననుసరించి ఈమహబూబునగరు మండలము ప్రాచీనాధునాతన సంస్కృతాంధ్ర కవి పండితుల సమాచారము సేకరించు పనిమీ ద పెక్కు గ్రంధములను బరిశీలించితిని. అనేక ప్రదేశములలో దిరిగితిని. చాల మంది పిన్న పెద్దలను దర్శించితిని. ఈకృషిఫలితముగ మూడువందల మంది సంస్కృతాంధ్ర కవి పండితులు లెక్కకు వచ్చినారు. ఇంకఁగేవలము పేరు మాత్రమే తెలిసి యితర విశేషములు తెలియనివారు రెండు వందలమంది వఱకు తేలినారు- ఈ సంఖ్యలు నాపూర్వపు దురభిప్రాయమును తొలఁగజేయుటే కాక నాలో నానందోత్సాహములను వెల్లివిరియఁజేసినవి ఇందఱు మహానుభావులు వర్ధిల్లిన ఈ మండలమున తాత్కాలికముగ నైన నివసింపఁగలిగిన భాగ్యమబ్బి నందులకు గర్వించు చున్నాను.

పైఁజెప్పిన పనిలో నుండగా గీర్తిశేషులు గోపాల కవిగారి పేరు తెలిసినది. గోపాల కవిగారి సన్నిహిత బంధువు, నాకు మిత్రులునైన శ్రీ. వి. కృష్ణమూర్తి గారు టీచర్, కవిగారిని గూర్చిన కొన్ని విశేషములు చెప్పి తమ కందినంతవఱకు కవిగారి రచనలు:-

1. అచ్చతెనుగు వేంకటేశ్వర శతకము.
2. నీతిశాస్త్ర భాషాంతరీ కరణము.
3. శివానందలహరి భాషాంతరీ కరణము.

అనుమూడింటి లిఖిత ప్రతులను దెచ్చి నాకిచ్చి పరిశీలింపఁగోరిరి. మొదటి రెండింటిని స్థాలీ పూలకముగఁ బరిశీలించి కవిగారి సామర్థ్య మెంతటిదో గ్రహించితి ని. "శివానందలహరి" పై నాకుగల గౌరవమొకవంకను పుట్టువుచేత వైష్ణవ సంప్ర దాయమునకు జెందిన వారైనను 'శివానందలహరి' నాంధ్రీకరించుట వారి శివకేశవా భేదాద్వైత తత్త్వములను బట్టి చూపుచున్నదను విశేష మొకవంకను నన్నుత్సాహ పరుపగా బరిశీలించి యమందానందము నందితిని.

శ్రీ మదాది శంకరుల కృతియైన 'శివానందలహరి' ప్రాశస్త్యము గూర్చియిటఁజర్చింప బనిలేదు అది భక్తి భావ సింధువు. సాహితీ ప్రియా భావులకెల్లరకిందలి యొండు రెండు శ్లోకములైన గ్రంతస్థములు గాఁకపోవు అట్టి యాకృతి రాజము నింతకు బూర్వమే కొందఱాంధ్రీ కరించిరి. చాలకాలమునకు బూర్వము కీ. శే. బలిజేపల్లి లక్ష్మికాంత కవిగారి యాంధ్రీ కృతిలోనివని చెప్పి యొకరు కొన్ని పద్యములను విని పింపఁగా వింటిని విన్నంత లోనవి దీర్ఘ సమాసభూ యిష్టములై యోజోగుణ ప్రధా సముగ నున్నవని యప్పుడొక యభిప్రాయము కలిగినది.

భాషాంత రీకరణ కృత్య మొక యసిధారా వ్రతము ఎంతటి పండితునికైన నొక విషయమున దృష్టినుంచినచో నింకొకటి చెడక తప్పదు వృత్తమకుట స్వీకా రముచే బాలసరస్వతుల వారి భర్తృహరి యాంధ్రీకరణము చెడినది. ప్రాయికముగ మూలశబ్దమును దృష్టినుంచుట జేసి శ్రీనాథుల వారి నైషధము డుముపులు చేర్చిన సంస్కృత కావ్యమే యైనదన్న విమర్శకోక్తియందు గంతయైన సత్యము లేకపోలేదు. ఇఁకమూల భావము నేమాత్రము విడువక, మూలశబ్దములను సైతము వీలయినంతవరకు గ్రహించుచు రచన సాగించిన యేనుగు లక్ష్మణుని యాంధ్ర కృతి సర్వజనామోద మందినది. మూలభావమును ఛాయామాత్రముగ గ్రహించి, సర్వస్వతంత్రముగ రచింప బడిన యనువాద గ్రంథములు బెక్కులున్నవి

ప్రకృతమైన గోపాల కవిగారి యాంధ్రీకృతి. వీరు వైష్ణవులయ్యు నీగ్రంథాం ధ్రీ కరణకు బూనుకొనుటకు శివభక్తియే కారణమనుట తథ్యము. కాగా వీరు మూలభావమునే ప్రధానముగా గ్రహించి తమ పద్యమున నది చెడకుండునట్లు ప్రయత్నించినారు,

ఈమూలములను ఆంధ్రీకరణమును దిలకింప వచ్చును.

శ్లో॥ 27 కరస్థే హేమాద్రౌ

హేమనగంబుకేల — పేజి. 6. రెండవ పద్యము

మూలము నందలి శీతాంశు శబ్దముకంటె ఆంధ్రములోని సుధాధామ శబ్ద మెంత సరసముగ నున్నదో సహృదయులు గ్రహింప గలరు.

యిట్లె శ్లో 40 ధీయంత్రేణ వచోఘటేన

క్రమమున బుద్ధియంత్రమున, పేజి. 9 మొదటి పద్యము,

ఇందు భావము చక్కగ నిమిడినది. మాలారూప కాలంకారము యథాతథముగా గ్రహింప బడినది. యతిప్రాస స్థానముల నెంతైనను వ్యర్థపదములు పడలేదు. కవి

గారెంతలోఁతుగ నాలోచించి, పదములను దూచి ఈ రచనను సాగించినారో తెలిసి కొనుట కీరెండు పద్యములు జాలును. గ్రంధమెల్ల నిదేరీతిలో నడచినది.

రెండు, మూడు చోటుల కవిగారు శ్రమ పడినట్లు కనఁబడుచున్నది గాని మూలములోని యర్థవైచిత్రి తెనుఁగున లోపించినట్లు దోఁచుచున్నది చూడుడు.

శ్లో 51. భృంగే ఛ్ఛాసటనోత్కటం

పేజి. 10 ఆరవ పద్యము :- నాద మనోహరుండు కరినాథ మనోగ్రహణుండు. ఈపద్యమున మూలములోని మహాసితవపుః. సత్వక్షస్సు మనోవనేషు, భ్రమరాధిపః మొదలైన సమస్త పదములు యథామూలముగ గ్రహింపఁబడినవి, స్ఫురన్మాధవా హ్లాదః - అను దానిలోని వైచిత్రి తెనుగులో రాలేదు. దానినిగూడ గ్రహించుట కవి కంత శ్రమకాదు. పునరాలోచించి యుండినచో నీ చిన్నిలోపముకూడ లేకుండఁ బోయెడిది.

శ్లో 63. మార్గావర్తిత పాదుకా పశుపతీ రంగస్య కూర్చాయతే!

ఇత్యాది శ్లోకమునందు చాలప్రసిద్ధ శివభక్తుడైన తిన్ననిమూఢభక్తి వర్ణితమైనది. అది ధూర్జటి శ్రీ కాళహస్తీశ్వర మహత్మ్యమున గననగును. చెప్పులను, గండూషాంబువులను, కించిద్భక్షితమాంస శేషకబళమును నీశ్వరార్చనా విధియందుపయోగించినవాఁడు తిన్నఁడే కాని అమూఁడింటి నుపయోగించినవారు మువ్వురు భిన్నవ్యక్తులుగారు. భిన్నవ్యక్తులని కవిగారు పొరబడి నట్లీ పద్యమున గనఁబడుచున్నది.

చినిగిన పాదరక్ష పేజి. 13 రెండవ పద్యము

పుక్కిలి షష్ఠివిభక్తి కాంతము గనుక పుక్కిట అని తేలికగా దిద్దవచ్చును.

భక్తిః కింనకరోతి - "అను దానికి భక్తికి మించిన చేమిలేదిలన్" అనుట సరిపడును.

యిందకక్కడక్కడ నిట్టి బాషాంతరీకరణములోని చిన్న చిన్న లోపములును ఆకారసంధులు, వ్యతిరేక క్త్వార్థ కేకార సంధులు, అసాధు సమాసములు కనఁబడుచున్నవి. కవి గారికివి తెలియవని తక్కిన గ్రంథము జూచినవారెవ్వరుననరు. వీనిని తేలికగా సరిదిద్దవచ్చును.

మూలకారులు, కేవల పరమేశ్వరా పరమూర్తులు, వశ్యవాక్కులు అట్టివారి ఈ గ్రంథము నెవ్వరేవిధమున భాషాంతరీకరించినను గ్రహింపఁదగినదియే యుండును. కీ. శే. గోపాల కవిగారి కృషి ప్రశంసనీయము. సర్వజనాదరణీయము. నేటికైనా నీ కావ్యము వెలుగులోనికి రానుండుట ముదావహము. అచిరకాలముననే కవిగారి యితర కావ్యములుకూడఁబ్రకటింపఁబడుటకు సహృదయులు తోడ్పడుదురని యాసించుచున్నాను.



మ॥ జని దుఃఖంబులు దీరగా శ్రుతిశిర - స్థానాంతరాలంకృతం
బును భోగీంద్ర విభూషణంబు సుమనః - పూజ్యంబు విద్యాధరా
న్వితంబున్ భ్రమరాభిరామము మహా - శ్రీశైల శ్రీమల్లికా
ర్జున లింగంబు భవాన్వితంబు సుగుణా - రూఢంబు సేవింపెదన్



ముద్రణదాత:

హరిజనోద్ధరణలో ప్రముఖపాత్ర వహించిన

# శ్రీ పి. శేషిరెడ్డిగారు

అధ్యక్షులు

గ్రామ పంచాయితీ, పెద్ద తాండ్రపాడు.

అలంపూరు తాలూకా మహబూబ్‌నగర్ జిల్లా.

శ్రీ రస్తు

శ్రీ మత్పరమేశ్వరాయనమః

# శ్రీ శివానందలహరి

శ్రీ శంకర భగవత్పాదులు పరమేశ్వర నమస్కారము సకల పురుషార్థ సాధనమని తలంచి శివానందలహరి యను పరమేశ్వర స్తవము జేయువారై. ఆయ్యది నిర్విఘ్నముగ పరిసమాప్తి నొందుటకు నిష్టదేవతా నమస్కారమగు మంగళమును జేయుచున్నారు.

చ॥ సకల కలాస్వరూపులను జంద్ర కలాధరులన్ బరస్పర
ప్రకట తపః ఫలాయితుల భక్తఫల ప్రదులన్ ద్రిలోకపా
లకులను యోగిహృన్నిలయులన్ గరుణాకరులన్ న్నిరంతరో
త్సుకులను బార్వతీశ్వరుల దోరపుభక్తి భజింతు నామదిన్.

ఈ ప్రకారము మంగళము నాచరించి స్తవము నారంభించుచు శివానంద్యము తమ మానసము నెడ బాయకుండుటకు ప్రార్థించు చున్నారు.

ఉ॥ పొందుగనీ చరిత్రమును బుణ్యనదిన్ బ్రవహించి పాపధూ
ళిందల యెత్తనీక పిదళించి వినిర్మల బుద్ధి కుల్యన
స్పంద జవంబునం బఱచి సంసృతి తాపము జాపునీ శివా
నందసమాఖ్య సల్లహరి నాహృదయహ్రదమందు నిల్చుతన్

శివ భజనము మోక్షదాయకమని స్వయముగా దానిని జేయుచున్నారు

ఉ। సాంబు జటాధరుం ద్రిపుర సంహరణు న్నిగమాంతవేద్యునిం
త్ర్యంబకు బన్నగా భరణు నాద్యుని హృద్యుదయామయున్ జిదా
లంబుని దేవదేవు శుభలక్షణు శర్వుకురంగహస్తు బీ
తాంబరవంద్యు మామకహృ దంబుజమందు భజింతు నెప్పుడున్

అల్ప ఫలముల నొసంగు దేవతలను సేవింపక నిరంతర మునీ పదము నే సేవించు చున్నానని చెప్పుచున్నారు.

చ ఇలను గలారు స్వల్పఫల మిచ్చెడు వేల్పులు వేలు వారలం
దల పను స్వప్నమందయిన దర్పక సంహర వారలిచ్చునా
ఫలముల గోర నీసరస వర్తిలు విష్ణ్వజముఖ్య దేవతా
వలికిని దుర్లభంబగు భవత్పద సేవయె యెప్పుగోరెదన్

అజ్ఞుడనగు నన్ను రక్షింప నీయదియే భారమని చెప్పుచున్నారు.

ఉ॥ వైద్యమురాదు శాస్త్రముల బాండితిలేదు పురాణ వేదసం
వేద్యు డగాను గానము కవిత్వమెఱుంగను హాస్య నాట్యమం
త్రాద్యనభిజ్ఞు డన్ బ్రభువు లర్థము నాకెటు మెచ్చి యిత్తురో
హృద్యదయానిధీ పశుప తీ వశువౌనను బోవవే దయన్

వ్యర్థ విషయములందుఁ బోవక పరమేశ్వరుని భజింపుమని బుద్ధినిఁ బుజ్జగించు చున్నారు.

చ　కడవయుఁ గాని మన్నయినఁ గాని మహా పరమాణువైననే
ర్పడఁ బోగరైన నిప్పయినఁ బర్వతమే న్వాలువేని తంతువేన్
గ్రడపనె కాలు తర్కవచ నంబుల నూరక కంఠ శోషమౌ
మృదు పద కంజముల్ గొలువ మించిన సౌఖ్యము గల్గునే సుధీ

ఇట్లు బుద్ధిని బుజ్జగించి తక్కిన యింద్రియములు గూడ నీశ్వరసేవా పరతంత్రములగుటను గోరుచున్నారు.

ఉ।　నీ పదభక్తి ప్రేమనము నీస్తుతి సల్పఁగ నాదు వాక్కులున్
నీ పరిచర్య హస్తములు నీ కథలంగనఁ గర్ణయుగ్మమున్
నీ పదబుద్ధి నేత్రములు-నింగన భాగ్యమొసంగి బ్రోవుమ
య్యా పరమేశ యన్యవిష-యాదులపై మది గోరకుండగన్

పరమేశ్వరుని విడిచి యన్య దేవతలను సేవించుట వృథా భ్రాంతియే యని చెప్పు చున్నారు.

ఉ　ముత్తెపుఁ జిప్ప వెండియని మురఁగు గాజును రత్నమంచునీ
రెత్తిన పిండి పాలని స మృద్ధ జలంబని యెండమావులన్
జిత్తమునన్ భ్రమించు గతి నిన్ జగదీశు మహేశునిన్ మదా
యత్తజనుం డెఱుంగక త్వ దన్యుని సేవునిఁగా భ్రమించెడిన్

ఈశ్వరానుగ్రహము సంపాదించుటకు సులభోపాయము చెప్పుచున్నారు.

మ।　నినుఁ బూజింపఁ బండుండు పూలకొఱకెంతే లోతునీసన్న చె
ర్వునఁ జొచ్చున్ గడు పెద్ద కారడవిలోఁ బోవున్ విశాలాద్రిపైఁ
జని చిక్కుల్వడు నీకు మేశ్వర! మనో-బ్జంబొండు నర్పించి నె
ట్టన నానందముతోడ నిచ్చుటనె యుం డం గాన లేదకటా.

కర్మవశంబుననే నెట్టి జన్మంబు లెత్తినప్పటికి నాచిత్తము నీ పదస్మరణా యత్తము చేయుమని. వేఁడికొను చున్నారు.

చ.　వనములఁ బర్వతంబులను వర్తిలు జంతువెయ్యైన దోమయ్యై
నను నరుఁడైన దేవుఁడయినన్ బశువైనను బుర్వయైనతే
కను విహగాదులైన నవు గాక మనంబు భవత్పదాబ్జ చిం
తన సుఖవార్ధి మగ్నమయి నన్ భయమేమి తదీయ జన్మకున్

ఈశ్వరభక్తి కలుగకున్నచో నెట్టియుత్తమాశ్రమముఁ జెందినను నిష్ప్రయోజనమని చెప్పుచున్నారు.

మ॥ వడుగైనం గృహమేధినైనను తపోవంతుండునైనన్ జటిం
ద్రుడునైన స్మతి యెవ్వరేనను జగ ద్రూపా? ఫలంబేమి యె
వ్వడు భక్తిన్ దన చిత్త పంకజము నీ స్వాధీనముంజేయు నే
ర్పు డనీ వాతని వాడవౌచు భవభారంబు న్వహింతీశ్వరా

నిరంతరము దనయంతఃకరణము నీపరాధీనముచేయు వాడే యోగీశ్వరుడుగాని గుహాదులయందు వసించు వాడు కాడని చెప్పుచున్నారు.

మ॥ గుహయందుం గృహమందు నెండ నడవిన్ గోత్రంబుపై నీటిలో
దహన జ్వాలలనున్న నేఫలము రుద్రా? తెల్పు మెల్లప్పుడున్
రహి నెవ్వాని మనంబు నీపదములన్ రాజిల్లునో యోగమి
మ్మహిలో నయ్యదె వాడె యోగిపతి యమ్మాన్యుండు సౌఖ్యాత్ముడౌ

నిశ్చలమగు చిత్తములేక మూర్ఖుడనుగానున్న నన్నుద్ధరింప నీవే సమర్థుడవని వేడుకొను చున్నారు,

మ॥ పలు కష్టంబులు నావలెన్ బడు మహాపాపుండు దీనుం డెవం
డిల నీకంటెను దీనపాలకు డొరుం డెవ్వండు నిస్సారమై
మలినంబై నిజ భక్తి శూన్యమగు సంసారాంబుధి న్మున్గి యే
న్వెలిరాజాలక గ్రుడ్డినై తిరుగు నన్వేగావమే లీశ్వరా.

నేను జేయబడిన యపరాధములన్నిటిని క్షమించి నన్ను రక్షింప వలయునని ప్రార్థించు చున్నారు:

ఉ॥ దీనుల కీవు చుట్టమవు దీనులలో గడు జెడ్డవాడనే
గానను మేశ? యిర్వురకు గల్గెను చుట్టరికంబు చెప్పకే
నేనొనరించు తప్పులను, నీవె క్షమింపవలెన్ గృపన్ననున్
బూనిక బ్రోవగా వలయు బో యిదె చుట్టరికంబు చెల్మియున్.

ఓ పరమేశ్వరా? నన్ను రక్షింప నీకు గోరిక గలిగిన యెడల యెంతటి దుస్సాధ్యమైన దైనను సాధింతువని చెప్పుచున్నారు.

మ॥ నను గాపాడగ శ్రద్ధ నీకమరి యున్నన్ బలే దురాశాత్ముగా
గను నీధ్యాన విహీను గాగ విధిలె క్కన్ వ్రాసియున్నట్టి వ్రా
తను బోదూడ్చు వశక్య మంచనినచో దార్ఢ్యంబు దుర్భేద్యమై
చను నా బ్రహ్మ శిరంబు గోట నెటు ద్రుంచన్ జాలితీవీశ్వరా.

దీనరక్షకుడవగు నీయనుగ్రహమును సంపాదింప గలుగుటకై మానుడుటియందు దైన్యము వ్రాసిన యాదైవము మాకెంతయు నుపకారి యేయని చెప్పచున్నారు,

మ॥ కడు దీర్ఘాయువు నిమ్ము బ్రహ్మకుదయన్ గౌరీశ? ఖండింపగా
జడకున్నట్టి చతుశ్శిరంబులి (క దుం పంబోకదే మన్నయె
న్క్రడు దైన్యంబు లిఖించి ఫాలమున మా కున్ మేలు చేకూర్చని
ప్పుడమిన్ జింతిల నేల నీదుకరుణా పూరంబె మమ్మేలెడిన్.

ఓ దేవ దేవా! నీ చరణారవింద దర్శన భాగ్యము లభింపనిదే నీకృపావ లోకనము నాపయి ప్రసరించుట యెట్లు! కావున నట్టి యదృష్టము నాకు (గలుగ (జేయు మని వేడుచున్నారు.

శా స్వామీ! నా తొలిజన్మ పుణ్యమున నీ చంచద్దయన్ గానినీ
శ్రీమద్దివ్య పదాబ్జ దర్శనము సం సిద్ధించినన్ సంభ్రమో
ద్దామౌత్సుక్య నమస్కృతామర శిరో ద్యద్రత్న కోటీరసం
స్తోమంబెంతయు నడ్డగింప నెటులన్ జూడంగనౌ నీశ్వరా!

ఓ జగద్రక్షకా! మోక్షప్రదుండవగు నీవే నాయజ్ఞానమును బాపి నన్ను రక్షింప(గలవా(డ వనివేడుచున్నారు.

ఉ॥ ఒక్క(డవే జనాళికి స మున్నత మోక్షమొసంగు వేల్పవీ
పక్క మలాక్షముఖ్యులు (ద్వ దర్పిత దివ్య పదంబులందియున్
మక్కువనింక (గోరుదురు మాధవ నీదయ (జెపనౌనెనా
యిక్క(డు చిన్నకోర్కి యది యెంతనను‌న్ గృప నెట్టు బ్రోతువో

ఓ కల్యాణమూర్తీ! దురంతమగు సంసార సాగరము న(భ్రమించుచు నధిక దుఃఖములనుభవించు నట్టి నన్నేలుమని వేడుచున్నారు

చ అమిత దురాశ దుష్ప్రభుల ద్వారము లందిరుగాడుచున్ దురం
తము దురితాల వాలము న నారతదుఃఖదమైన సంసృతిన్
గుములు మదార్తి (దీరుప(గ గోరవు బ్రహ్మకు మేలు సేతకా
(మి (దెలు పంగదయ్య కడు ధన్యుల మట్లయి నన్మహేశ్వరా.

ఓ సచ్చి దానంద రూపా! నాచిత్తమను వానరము మిక్కిలి చపలత్వము తో నెల్లడల సంచరించు చున్నయది దీనిని నీస్వాధీనము చెసుకొమ్మని ప్రార్థించు చున్నారు.

చ॥ తిరుగుచు నుండు మోహవని (ద్రిమ్మరు (గొమ్మల చన్ను (గొండలన్
గరమెగ (బ్రాకు నాశలను కాండములంచన యిచ్చనంతటన్
బరుగిడు నాదు చిత్తకపి భర్గు(డ భిక్షుక భక్తి త్రాట (డ
క్కరియగు దీని భద్రముగ (గట్టి స్వవశ్యముచేసి కొమ్మికన్.

తన చిత్తమును శివాగా నారోపించి దానియందు నివసింపుమని పరాత్పరు ని వేడుకొను చున్నారు.

శా॥ స్వామీ! దర్పక దర్ప సంహర ధృతి స్తంభాంచితంబుగా గుణో
ద్దామా బద్ధము కామగంబును వి చిత్ర స్ఫూర్జితంబుగా రమా
ధా మంబుగా బ్రతి వాసర ప్రకట సన్మార్గాప్తితంబైన మ
త్శ్రీమచ్చిత్త కుటిగా వసింపుము సదా శ్రీశక్తి యుక్తుండవై.

నేనెన్ని విధముల ( బ్రయత్నించినను నాకు లొంగక ధనాపహరణమునకే ప్రయత్నముచేయు నాచిత్తమను దొంగను బట్టుకొమ్మని సర్వేశ్వరుని వేడుకొను చున్నారు.

మ॥ అతిలోభాది గుణంబులం గలిగి ప్ర వ్యాకర్షణా ధీనమౌ
మతి శ్రీ మంతుల యిండ్లదూరి చనగా మచ్చిత్తచోరుండుద
ర్పితు (డై యత్న) మొనర్చు వీని నెటులైన రింతుగా బ్రభూ! తస్కర
ప్రతతీశా! త్వదధీను (జేసికొని నగా పాలింపు నిర్దోషముగా.

ఓ సర్వేశ్వరా! నీపూజకు ఫలంబుగా నాకు బ్రహ్మత్వంబును గాని విష్ణుత్వంబునుగాని దయచేయుదువేమో? ఆపదవులు నాకక్కరలేదు మోక్షానందమునే యనుగ్రహింపు (డని వేడుచున్నారు.

చ॥ సలిపెద నీదుపూజల ల సద్దయ మోక్షసుఖమ్మొసంగు మా
పలములకైననుగా హరిగ బ్రహ్మగ (జేసెదవేమొ వెండిని
న్నిల దివి (జూడ వారివలె నేన్మృగపక్షిత (దాల్చి కానక
త్వలఘు తదీయ ఖేదమెటు లాత్మ సహింప (గలాడ శంకరా,

ఏ.

కైవల్యంబునకు ముఖ్యసాధనమగు శివసాన్నిధ్యము తనకు లభింపవల యునని కోరుచున్నారు.

ఉ॥ రంగగు వెండికొండ పయి రాజిత సౌధమునగా గణాళితో
సంగజవైరి సన్నిధిని నౌదల (గేల్గవమోడ్చి నిల్చి యో
మంగళరూప! పాహియని మాటికి (బల్కుచు బ్రహ్మకల్పము
ప్పొంగు మనంబుతో క్షణము పోలిక (బుచ్చుట యెన్నడబ్బునో.

పైన (బేర్కొనిన దానినే వేరొక విధముగా నుడువు చున్నారు.

మ॥ జయ జయ నాదముల్ మునులు సల్ప విరించి ముఖుల్ నుతింపని
ర్భయుత గణాళి యాటలను బాటల (దేల నుమాసమేతు(డై
నయముగ (గోడె నెక్కి హరి ణంబును దాల్చి కుఠారపాణియై
రయమున వచ్చు శంకరు ది రంబుగ (గన్గొను భాగ్య మెప్పుడో,

దానినే వేరొక విధముగా (జెప్పుచున్నారు,

చ. వరదు డవైనని స్గని ఛ వత్పద కంజము బట్టి చేతులన్
శిరమున దాల్చి కన్ను గప జేర్చి యురంబున హత్తి కౌగిటం
దిరముగ జొన్పి యవ్విక చ-నీరజ గంధములాని విష్ణ్వజా
మరుల కలభ్య మౌముదము మానస మందెపు డందుటోభవా.

ఓ సర్వేశ్వరా! సర్వ సంపూర్ణుండవగు నీకు నేనీయవలసిన దేమియు లేదు నామనస్సే నీ కర్పించు చున్నాను. గైకొనుమని వేడుచున్నారు.

ఉ॥ హే మనగంబు కేల ప్రపనేశుడు మ్రోల గృహంబునందు చిం
తా మణి కామధేను విబు-ధ క్షితిజంబు శిరంబునన్ సుధా
ధాముడు సచ్ఛాద్రిప్రమద దాయము పాదములందు నుండనే
నేమిడువాడ నీకు గొను మిచ్చెద నాహృదయంబు శంకరా.

క్రింద జెప్ప బోవు హేతువుల బట్టి యా యాపదవులు లభించుటవల న నేను ధన్యుడనైతినని చెప్పుచున్నారు

మ॥ శివ సారూప్యము నీదుపూజసలుపన్ శ్రీ కంఠ సంకీర్తనన్
శివసామీప్యము మేశభక్త జనసం స్నేహాను లాపంబులన్
శివ సాలోక్యము విశ్వరూపకతను శ్రీ ధ్యాన సంపత్తిచే
శివ సాయుజ్యము నాకు నిక్కడలభిం చెన్ దేవనే ధన్యుడన్.

నీకటాక్ష వీక్షణంబు నాపై బ్రసరింజేయుమని వేడుచున్నారు.

చ॥ నిను స్మరియించెదన్ గిరిశ నీచరణాంబుజ పూజసల్పెదన్
నిను శరణంబు జెందెదను నిన్వ చనంబుల సన్నుతి చెదన్
వనజ భవాది సర్వసుర వాంఛిత సత్కరుణా కటాక్షవీ
క్షణసుధ జిల్కితత్త్వము ల సన్మతి నాకు పదేశమీ గదే.

ఓ సకల లోకేశ్వరా! నిన్ను సేవించుటకు నసమర్థుడనైన నన్ను రక్షింప నీయుదియే భారమని చెప్పు చున్నారు,

మ॥ మురువౌ వస్త్రవిధిన్ సహస్ర కరు గాం బుష్పార్చన న్విష్ణు గా
పరగన్ గంధవిధి న్సుగంధ వహుంగా బర్హిర్ముఖాద్యక్షు గా
వరపాక క్రమమందు పాత్రవిధిన్ భర్మోదరుంగా నొన
ర్పరహిన్ సేవలొనర్తు నో పశుపతీ బాలేందు చూడామణీ.

ఓ దయామయా! నీ యపారమగు కృపారసము వెల్లడింప నీయుక్కి నిదర్శనమే చాలునని చెప్పుచున్నారు.

చ॥ గొనబు దలిర్చ వేల్పులను గుక్షిని నున్న చారాచరావళిన్
మనుప (దలంచి సర్వసుర మానస భీతిద మౌవిషంబు బ
ల్మిని గళ భాగమందునిచి మ్రింగక (గ్రక్కక నిట్లు నీవొన
ర్చిన పరమోపకారమె హరి త్రిభవప్రదయ(దెల్ప( జాలెడిన్.

ఈశ్వరు(డు గ్రహించిన విషంబును మూడు విధములగా వికల్పించు చున్నారు.

ఉ॥ మంటలు గ్రమ్ముచున్ సురస-మాజ భయంకర హౌ విషంబెటుల్
గంటవి చేత( బట్టి తెటు-గమ్మనినే రె(డు బండటంచు(జే
కొంటివె నాల్కయందు నిడుకొంటివి సిద్ధరసంబె దెల్పుమే
మంటిమి దేవ! కంఠమున యందది దాల్చితి వింద్రనీలమా.

ఓ పరమేశ్వరా! నీ సేవా విశేషంబులలో నొకొక్క దానిచేతనే మోక్షము సులభమై యుండ నితర దేవతల స్మరించుట నిష్ఫలమని చెప్పుచున్నారు.

మ॥ నిను సేవించిన సన్ను తించిననుగా- నీ మ్రొక్కినం బూజస
ల్పిన ధ్యానించిన నీకథల్ వినిన నిన్స్వీకింప మా బోంట్లకొ
క్కని మేషంబున మోక్షమబ్బగ స్థిరుల్ గానట్టి దేవాళి (గొ
ల్చిన నేమున్నది? వారలేమిడుదురో శ్రీకంఠ! ప్రార్థించినన్.

పరమేశ్వరు (డు(డనన్య స-మాన్య మహిమగలవా(డని చెప్పుచున్నారు.

మ॥ భవదత్యద్భుత ధైర్యమేమనుచు (జె ప్ప న్వచ్చు నీసాహసం
బువిలోకింప (గనేరికైన (గలదే భూతేశ? కల్పాంతవే
ళవినాశంబగు లోకముల్ గని సుర ల్బారన్ మునుల్ భీతి(జెం
దవినిర్భీతి (జరించి తొక్క(డవె యా నంద ప్రపూర్ణుండవై,

ఓ సర్వేశ్వరా! నీసుగుణంబులన్నియు (దెలిసినవే కదా! ఇంకనిన్ను (బర మాప్తునీగా దలంచు చుండుటకంటె వేఱేమియు నే(జేయవలసినది లేదని చెప్పు చున్నారు.

గా॥ యోగక్షేమ (పహుంతవై(యు భయలో-కోద్యన్మ తోద్బోధివై
బాగు న్గూర్చు దయా కరుండవయి స-ర్వజ్ఞుండవైలో వెలిన్
రాగిల్ల న్వసియించు నీవలన మ ద్జాతవ్య మే ముండెడిన్
ఏ(గొల్తున్ బరమాంతరంగికు(డు నా కీవంచు చిత్తంబునన్.

సా తా ం త ర ము.

చ ఇహపర బోధివై సుఖము- లెల్లర కిచ్చుచు క్షేమయోగస
ద్విహితవహుండవై సకల-వేద్యుడవై కరుణాకరుండవై
రహి బహిరంతరంబుల వి- రాజిలు నిన్వివరింప నేలయు
స్వహము మదంతరంగికుండ వంచుమదిన్ స్మరియింతు. శంకరా.

ఓ యీశ్వరా! నీపూజయే నాకు పుణ్యాహ వాచనంబని చెప్పుచున్నారు.

ఉ॥ మత్తను మందిరం బలికి మంగళ సిద్ధికి భక్తిత్రాట మ
చ్చిత్త ఘటంబు బుట్టి కడు చెల్వుగ హర్ష జలంబు నింపినీ
యుత్తమ పాప పల్లవము లుంచి వివేక ఫలంబు బెట్టి సం
పత్తి ఘటిల్ల సత్త్వమను మంత్రము బల్కుచుబూజ సల్పెదన్.

ఓ యీశ్వరా! విద్వాంసులు వేదమను మహాసాగరంబును మథించి యందుండి సారంబుగా నిన్ను గ్రహించు చున్నారని చెప్పుచున్నారు

మ॥ సుమనస్సంఘము చిత్త మందరము నౌ త్సుక్యంబుతో భక్తిసూ
త్రమునం గట్టి మథించి వేదజలధిన్ రాజిల్లు సోమున్ సుప
ర్వ మహీజంబును. కామ ధేనువు మణిన్ బ్రాజ్ఞ ప్రమోదామృతం
బు మహిచ్ఛవిభవంబు బొందుదురు వి స్ఫూర్తిన్ జగన్నాయకా.

చంద్ర దర్శనము వలన సముద్రముప్పొంగు నటు సదాశివ సందర్శనము వలన నానంద సముద్రముప్పొంగు చున్నదని చెప్పుచున్నారు.

మ విలసత్ప్రాకృత కృతాది దర్శిత సుధా విద్యోతసన్మూర్తి స
త్కలసేవ్యుండు కురంగధారియు తమో దూరుండు పూర్ణుండు ని
ర్మలు డౌ సోము డు హృన్న భోంతరమునన్ రాజిల్లినేన్ మహో
జ్జ్వల దానందపయోధి పొంగసుమన స్సంఘంబులో లాడెడిన్.

ఒక పట్టణంబున మంచివాడగు రాజుండిన యెడల దేశమునకు సర్వ సమృద్ధి గలుగునట్లు నా హృదయంబున సర్వేశ్వరుండుండుటన్ జేసి నాకు సర్వ సమృద్ధి గలిగియున్నదని చెప్పుచున్నారు.

చ తనరెను నాల్గు పాదముల ధర్మము పాపము మాయమయ్యె గ్రు
క్కైను రిపుషట్క మున్నతిని. గీర్తిలె కాలములన్ని జ్ఞానసా
ధన పరమౌష ధుల్ వెలసె దానువసింప గ రాజశేఖరుం
డనయము మోక్షదాయియయి యస్మదుదంచిత హృత్పురంబునన్.

ఓ విశ్వేశ్వరా! నేను మహాపలంబును బొందిన పాడనౌటచే దుర్భిక్షభయ మూలేదని చెప్పుచున్నారు.

చ॥ క్రమమున బుద్ధి యంత్రమున (కమ్మని వాక్యఘటంబునన్ గవి
త్వమనెడు కాల్వదారిని భ వచ్చరి తాంబుధి వారినాదుడెం
దమను పొలంబులో (బడి సదా ఫలియింపఁగఁజేసె భక్తిస
స్యముల నుమేశ నేని (క భ యుం పడ నెంతటి కర్వు వచ్చినన్.

ఓ దేవా! నీవు దుర్గాతిలోలుఁడవు గాన నామనో దుర్గమందు నివసింప మని ప్రార్థించు చున్నారు.

మ॥ బటు గాంభీర్య మనోజ్ఞ ఖేయము ధృతి ప్రాకార మంచద్గుణో
ద్భట సన్మాల బలంబు దేహవిషయ ద్వారంబు విద్యాసము
త్కట వస్త్రాజ్వలనౌ మదీయ హృదయో ద్యద్దుర్గ మధ్యంబులో
పట దుర్గాతిశయప్రియా! భవ! చిరా వాసంబు గావింపుమా.

ఓస్వామీ! కిరాతులకుఁ గావలసిన విషయము లన్నియు నాయందున్నవి నీవును గొప్పకిరాతుఁడవు గావున నాయందెల్లప్పుడు నీ యిష్టంబు వచ్చినటుల విహరింపుమని వేడుకొను చున్నారు.

ఉ॥ ఆదికిరాత! నాతనువు నందె నివాస మొనర్పు మయ్య యా
హ్లాదముతోడ నాదుహృద యాటవిలో మద మత్త కామ మో
హాది మృగంబు లున్నవి ర- యంబున వానిని బిల్కుమార్చి స
మ్మోద మెలర్ప నెచ్చటికిఁ-బోవక నిచ్చలు వేట సల్పు చున్.

పరమేశ్వరుఁడను సింహము తన చిత్తమను గుహయందు వసింపు చున్న యది నకింక భయము లేదని చెప్పుచున్నారు.

చ॥ కరమున నెప్పుడున్ మృగము గల్గినమేటి కరీంద్ర హంత దు
ష్కరమగు వ్యాఘ్రము భంగ బల శాలియు జంతు వినాశ కారియున్
వరవిశదస్వరూపిగి రి పట్టిలు దిట్ట మదీయ హృద్గుహాం
తరమున నుండె పంచవదన ప్రభువే న్భయమంద నింకటన్.

పరమేశ్వరుని పాదపద్మ ద్వయమును పిట్టగూడు గానారోపణంబును

జేసితన మానసంబు నొక పిట్టగూడుగా నరోపణచేసి యాపిట్ట గూటిలో నుండుమని భోధించు చున్నారు,

ఉ॥ వేద మహీరు హాగ్రమయి విప్ర పతాన్వితమై సుఖ ప్రదం
బైదళిత శ్రమంబయి సు ధాఖఫలో జ్వలమైన శ్రీ భవా
నీ ధయితాంఘ్రి పద్మయుగ నీడమున న్విహరింపు మెప్పుడా
హ్లాదము తోడ హృద్విహగ మా పెఱచోట వృథా చరింపకన్.

తమ మానసము నొక రాజహంసమునుగా నారోపణచేసి దాని నీశ్వర పాదపద్మమను సౌధమున సుఖముగ నివసింపుమని బోధించు చున్నారు

చ॥ కరరుహ కాంతి దీప్తమయి క్రమసుధాపరిధౌ తమైల స
త్సర సిజరాగ భాస్వ మహీ తంబయి హంస గణాశ్రితంబు నై
పరగిన పార్వతీశ పద పంకజ సౌధమునందు భక్తి సుం
దరులను గూడి స్వేచ్ఛ సత తంబు చరింపుము చిత్తహంసమా.

తమ మానసంబు నొక యుద్యాన వనముగా జేసి దానికీశ్వర ధ్యాన మను వసంత ఋతువు వలన గలిగిన విశేషమును వర్ణించు చున్నారు.

చ॥ పరశివు ధ్యానచైత్రము ప్రవర్తిల డెందపు బువ్వుదోటలో
దురితపు పండుటాకుగమి తొ్రటిలె భక్తిలతల్ విరాజిలెన్
వరలెగుణ ప్రకోరక జపః ప్రవచస్సుమరాజి వాసన
ల్బెరసె సుధామృతంబు వెగ లెన్ సువివేక ఫలంబు లేర్పడెన్.

తమ మానసంబు నొకరాజ హంసంబుగా నారోపించి దాని నీశ్వర ధ్యాన మను సరోవరంబును నాశ్రయించి యుండుమని హెచ్చరించు చున్నారు.

మ పరమానంద రసాలయంబు మునిదేవస్వాంత కంజాత సుం
దరమున్ సద్విజ సేవితంబు కలుష ధ్వంసంబు సద్వాసనా
కరమౌ శంకరు ధ్యాన పుష్కరిణి వే డ్కం జిత్తహంసేంద్ర స
త్వరతం జేరుము నీచ సంశ్రయ తటా వాస శ్రమంబేటికిన్.

ఈశ్వర భక్తి నొకతలగా జేసి దాని ఫలంబును గోరుచున్నా మనుచున్నారు

చ ప్రమద రసంబు నందడిసి భర్గు పదాంబుజ భూమి బుట్టిసై
ర్వ్య మనెడు ప్రాపు గల్గి దెస లంతట గొమ్మలు సాగి పాప పుం
గ్రిముల దొలంగి చిత్తమను కే రెడు పందిరి బ్రాకి సత్క్రియా
సమితి నెసంగు భక్తి లత సంతతము న్మద భీష్ట మిచ్చుతన్

శ్రీశైల వాసియగు పరమేశ్వరునిగా నారోపించి తమమానసపద్మంబున విహరింప వేడుకొనుచున్నారు

ఉ॥ నాద మనోహరుండు కరి నాథమద గ్రహణుండు మాధవా
హ్లాదుడు భృంగి పాలుడు మహాసి తదివ్య తనుండు పంచబా
ణా దరణోత్తముండు భ్రమ రాధిపుడున్ సుమనో వనోదితా
మోదుడు మన్మనోబ్జమున బొల్చుత శ్రీ గిరివాసుడెప్పుడున్.

పరమేశ్వరుని మేఘముగా నారోపణ చేసి తమ చిత్తమును చాతకం బామే ఘమును గోరుచున్నదని చెప్పుచున్నారు.

చ॥ పెలుచదయా మృతంబుఁ గురి పించి విపత్కృతినాతపంబుఁ బో
సలిపి వివేక సస్యఫల సంపదల న్విబుధాళికిచ్చుచున్
బలువిధ కామరూపివయి భక్త మయూరములాడ చంచలో
జ్జ్వలజట లొప్పనిన్ హృదయ చాతక మెన్నును నీలకంధరా.

సర్వేశ్వరుని నెమలిగా నారోపించి స్తోత్రము చేయుచున్నారు.

చ॥ ఫణిపతిచే కలాపిగ న భస్థలిచే శిఖఁగా శ్రితాళికిన్
ప్రణవ మహోప దేశవచ నంబుల కేకిఁ గఁ జెప్ప నొప్పుచున్
ఘనరుచి శ్యామ సద్రిజను గాంచి నటించుచు నాగ మాంతస
ద్ధ్వని విహరించు నిన్ రసిక వర్య భజించెద నీలకంఠునిన్.

పార్వతీ పరమేశ్వరులను నెమళ్లనుగా నారోపించి ప్రార్థించుచున్నారు.

చ॥ తొలకరిగాగ సంధ్యయె చతుర్భుజ హస్తహతానక ధ్వనుల్
జలదరవంబు గాగ సుర సంఘము చూడ్కులు మించుగాగభ
క్తుల పరితోష బాష్ప వితతుల్ ఘన వృష్టిగ నార్య బర్హిగా
నలరుచు నాట్యమాడు రసి కాగ్రణిఁ గొల్చెద నీలకంఠునిన్.

శుద్ధస్వరూపుఁడగు శంకరునికి నమస్కరించు చున్నారు.

శా॥ ఆద్యున్ హృద్యుని వేద వేద్యుని మహో ద్యత్తేజు విశ్వేశ్వరున్
విద్యానందము యాత్మునిం ద్రిభువన ప్రేమాస్పదున్ యోగిలో
కధ్యేయున్ విబుధ ప్రగేయు జటినిం గల్యాణు మాయావినిన్
సద్యోమోక్షదు తాండవ ప్రియు నమస్కారంబులం దన్పుదున్.

సకల ప్రపంచ స్వరూపుఁడయిన సర్వేశ్వరుని గొనియాడు చున్నారు

ఉ॥ నిత్యునకున్ గుణాత్మునక నింద్యునకా దికుటుంబికిన్ లస
త్సత్యున కద్రిజా పతికి సర్వ జగజ్జని కర్తకున్ ముని
స్తుత్యున కాగమాంత పరి శోభికి నాట్య వినోదికిన్ నమ
స్కృత్యము లాచరింతు జటి కిన్ పురజేతకు నిశ్చయుండనై.

నిన్ను సేవింపలేనివాఁడనైనను నన్ను రక్షించుటకు నీకు దప్పదని వేడ
కొను చున్నారు.

చ॥ అనయము పొట్టకూటికయి యందరి నింబతి మాలుచుఁ ధ (నా
శను జరియించితిఁ బృథగ సల్పను నీపదసేవ సుంత మ
ద్ఘన తర పూర్వ పుణ్యవశ త న్సకలంబున నుండు నీవె నా
మనమున నుండు వట్లగుట మన్పగ నీయదె భారమీశ్వరా.

ఓ సర్వేశ్వరా? నా యజ్ఞానంబును బాపి నాకుసాక్షాత్కరింపుమని ప్రార్థిం
చు చున్నారు.

ఉ॥ మెండుగ నాకసంబునను మేదిని వ్యాపితపౌతపంబు మా
ర్తాండు (డొకండె చెండి జన రాజికి (గన్పడు నీవొకోటిమా
ర్తాండని ఖండవయ్యు తెలియం బడవేల మహాత్మ! మత్తమో
మండలి యెంత దాని దును మాడి త్వదా కృతినాకుఁజూపవే.

ఓదేవా! నా చిత్త మెల్లవేళల నీపాదార విందములనే సేవింప (గోరుచున్న
దని చెప్పుచున్నారు.

చ వనజ వనంబు (హంసలును వారిధరంబును జాతకంబులుఁ
వన జహితుఁ రథాంగములు వారి జవైరి(జకోరసంచయం
బనయము గోరునట్టుల మ దాత్మయు నాగమ మార్గ వేద్య మ
త్యను పమమోక్షదంబగు త్వ దంఘ్రి సరోజ యుగంబు (గోరెడిఁ

ఓ చిత్తమా! నీవా సదాశివుని పాదపద్మంబులనే సేవింపుమని తమ చిత్త
మును హెచ్చరింపు చున్నారు.

మ। జలమగ్నుండు తటంబు బాంధుడవనీ జంబుఁ మహావృష్టిభీ
తిలు వాఁడింటిని భిక్షుడాలయపతిఁ దీనుండు శ్రీమంతు శీ
తల యుక్తుండనలుఁ దమోపహతుఁడు ద్య ద్దీప ముంజేరున
ట్లైలమిఁ జిత్తమ! సర్వభీతి హరగౌ (రీశాంఘ్రులం జేరుమా.

మ తన బిడ్డాపళు లాడుగుల్ నదులు సం ద్రం బుఁ లతల్ ద్రూనువే
డ్కని జాథీశు (బతి వ్రతామణి యు యన్నాంతంబునుఁ సూది హ
త్తిన చందంబున నాదు చిత్తమ! కప ర్ది శ్రీ పదాబ్జ ద్వయం
బును సేవింపుచు నుండు మెప్పుడదియే మోక్షంబు సద్భక్తి యౌ.

ఓ తల్లి తన పిల్లను గాపాడు కొనునట్లు భక్తి భక్తుని సదా రక్షించునని
చెప్పుచున్నారు.

I పులకలు హర్ష బాష్పముల (బుట్ట వివేక పటంబు గప్పి వా
క్సలలిత శంఖనిర్గళిత సచ్చరితంబను పాలు బోసి ని
ర్మల భసితంబు (బూసి రుదు రక్కలు రక్షగ(గట్టి ధ్యాన డో
లలని డి భక్తిమాత కృప లాలనసేయును భక్తబాలకున్.

భక్తియే పరమోత్కృష్ట మైనపనియు దానిని మించిన దింకొకటి లేదని వ్రాచున్నారు.

చినిగిన పాదరక్ష శశి శేఖరు(గన్భ్రమలం(దొ కండు మిం
చిన తమినుంచె నొక్కడభి-షేకము పుక్కిలినీట (జేసె పే
ర్మినొక (డు భోజనంబి డియె మెక్కిన మాంసపుముక్క భక్త పా
వను డొక (బోయ(డయ్యె భళి భక్తికి మించిన దేదియుర్వరన్.

ఓ ఖూశ్వరా! నాచిత్తంబను పాదుకలను దొడిగి కొని విహరింపు(డని వేడు కు చున్నారు.

II . బలు(డౌ కాలునురమ్ము దన్నుట మహా పస్మారముంజెందుటన్
మలలో ((దిమ్మరుటన్ న్నతామర శిరో మాణిక్య కోటీరముల్
దలమై రాయుట నొచ్చెనో మృదుభవ త్పాదాబ్జముల్ నా దు ని
ర్మల చిత్తంబను పాదుకల్ దొడిగి ప్రే మందిర్గు మా శంకరా,

పరమేశ్వరుని పాదారవిందముల భక్తితో (గొలుచు వారికి లభింపని దేదియును లేదని వక్కాణించు చున్నారు.

మునుపటి వోలె వక్షమున మోదునటంచుఱుకున్ యముండు భీ
తిని సురకోటి మౌళిమణి దీపపు పంక్తి నివాళులిచ్చు వే
డ్కను గని ముక్తికాంత భిగి కౌగిట (జేర్చు భవత్పదంబు లె
వ్వని మది నిచ్చలుం దలచు వానికి దుర్లభమేది మేదినిన్

నన్ను తప్పక రక్షింప వలసినవా(డవు నీవేయని వేడుకొను చున్నారు.

క్రీడార్థంబు సృజింతువెల్ల జగముల్ క్రీడా మృగంబుల్ జనుల్
క్రీడనే నొనరించు కర్మచయముల్ క్రీడల్ గదా నీకు నే
జాడ న్నెనొనరింప నీకది గదున్ సంతోషమేయౌట నా
కీడు న్మాన్పి క్షమించి తప్పులను రక్షిన్ నన్నుగా వందగున్.

ఈశ్వర ధ్యానమునునే శరణు మొందెదనని నుతువు చున్నారు.

సలలితమో దబాష్పజల సంయుతమై పులకాభి రామమై
విలసిత భక్తిమార్గ పరి విశ్రుత సౌఖ్యని వాసమై మహో
జ్వలతర దివ్యమోక్షఫల వాంఛిత యోగిజన ప్రపూజ్యమై
యలరెడు సాంబు ధ్యానమె యహర్నిశమే శరణంబు (జెందెదన్.

భక్తి యను ధేనువు నాకు లభించియున్నది దీనికి హానిగలుగకుండ రక్షింపుమని యీశ్వరుని వేడుకొను చున్నారు.

ఉ॥ అందము మీఱుచుండఁబ్రమ దామృతదుగ్ధము మాటికిచ్చు చా
నందముతోడ నీదుచరణద్వయ గోష్ఠమున న్వసింపుచుఁ
పొందుగ మత్పురా కృతసు పుణ్యముచే లభియించియున్న యీ
సుందరభక్తి ధేనువును సొంపుగఁ బాలనసేయు మీశ్వరా.

సర్వేశ్వరా! నేను సకల దోషంబుల కాశ్రయమైన వాఁడనే అయిననుచంద్రుని ఁజేకొనినట్లె నన్నునను గ్రహింపుమని వేడుచున్నారు.

చ॥ పర . గజ ఁడుండగాను పశు భావుఁడగాను కళంకిగాను దు
ష్కరకుటిల ప్రవర్తను ఁడఁగానుగదా? యొకవేళ యైన నీ
పరమ విభూషణాదరణ పాత్రునిగా గ మృగాంకునట్లు న
స్గరుణ ఁదలిర్పఁగైకొనవు న్యాయమె నీకిది రాజశేఖరా.

పరమేశ్వరుఁడు నా హృదయమునందే యున్నాఁడు నేనాతని నారాధించుటకు విశేషశ్రమ నొంద నవసరము లేదని చెప్పుచున్నారు.

చ। కలఁడు మదంతరంగమున కారుణికుండు ప్రసన్న మూర్తి య
త్యలఘు ఁడు రాజమౌళి భువ నాధికుఁడిష్టఫల ప్రదాత నే
ర్పల వడనే కతంబయిన సందఱిఁబింగెడు నట్టు లేనియుఁ
సులభముగా భజింపఁదగు సూరులు మెచ్చ స్వతంత్ర బుద్ధితోఁ.

పరమేశ్వర స్మరణంబు పాపంబులబాపిఁ ముక్తి నొసంగునని చెప్పుచున్నారు.

ఉ భావశరా సనంబునకు భక్తి గుణంబున మర్చి రూఢిగా
భావజవైరి సంస్మరణ బాణగణంబులతోడ కిల్బిష
గ్రావ విపక్షులందునిమి కాంచి జయంబతుల ప్రమోదు ఁడై
ఠీవి సుధీంద్రు ఁడొందు ప్రక టీకృత సుస్థిర రాజ్యలక్ష్మినిఁ.

ఓ సర్వేశ్వరా నీభక్తులు పరమధన్యులని చెప్పుచున్నారు.

ఉ॥ ధ్యాన మహాంజనంబున స దా పరీశీలన ఁజేసి చూచి స
న్మానిత శంకరా హ్వయ సు మంత్ర మహాబలి పూజలందమ
స్థానము ప్రక్కలించి సుర సంఘ సమాశ్రితమౌ భవత్పద
శ్రీనిధినెత్తి సౌఖ్యమును జెందెదువారె కృతార్థులిమ్మహిఁ

సదాశివుని పాదార విందముల సేవించుట యావశ్యకమని చెప్పుచున్నారు.

ఇతరులను సేవించుట వలన సుఖంబు లేదనియు శివుని సేవించుట చేత శాశ్వతమైన పరమ సౌఖ్యంబు లభించుననియు జెప్పుచున్నారు.

మ॥ జననంబు న్మరణంబు నొందు దివిష త్సందోహ సంసేవ నం
బున సౌఖ్యంబొక యించుకైన గలదే బుద్ధి న్విమర్శించినన్
జననంబు న్మరణంబు లేని విభునిన్ సర్వేశ్వరున్ సాంబు భ
క్తిని సేవించినవాఁడె ధన్యుఁడయి ముక్తిన్ గాంచి సౌఖ్యాత్ముఁడౌ.

ఓ మహాదేవా! నీవు నాబుద్ధియను కాంతను గూడి నాహృదయంబునంద నిరతము నివసింపుమని వేఁడుకొను చున్నారు.

ఉ॥ అందము మీఱనీ సరస యందు సపర్య లొనర్ప సచ్చిదా
నంద సముద్ర సర్వభువన ప్రియబాంధవ నీ కొసంగెదన్
సుందర సద్గుణాళిపరి శోభితమామక బుద్ధికన్య బ్రే
మందళుకొత్త నా హృదయ మందిరమందు మతోవసింపుమా.

ఓ దేవదేవా! నీకుపచారంబులు చేయుటకు నేనెంతవాఁడ ననుచున్నారు.

ఉ॥ హాళిమథింప జాల కల శాంబుధి ద్రవ్యంగ శక్తిలేదు పా
తాళము వేటలాడబెడి దంపుకిరాతుఁడగాను నీకు నే
హాలహలాశనంబును సు ధాంశుసుమం బహిభూష చర్మ వ
స్త్రాళిని దెచ్చి యెట్టులభవా! పరిచర్య లొనర్తు దెల్పుమా.

ఓ సర్వేశ్వరా! పూజించుటకు దగిన సామాగ్రి యుండినను పూజింప వలసిన స్థానము నెఱుంగని వాఁడనగుటచే నిన్నుఁబూజింప జాలనను చున్నారు.

ఉ। పూజలు సల్ప ద్రవ్యములు భూరిగనున్నవి గాని యెట్లు నే
పూజ యొనర్తు పక్షిగను పోత్రిగ రూపము జెంద దుర్లభం
బౌ జగదీశ! నీదుశిర మంఘ్రియుగం బెదియో యెఱుంగని
ర్వ్యాజముగా నెఱింగి రె త దాకృతి గన్న పితామహాచ్యుతుల్,

శివపాదార వింద ములవీడని భక్తియె కావలయునను చున్నారు.

చ॥ విసమె భుజించు చుండెదవు వేడ్క ధరింతువు పాప పేరులన్
వసనము ప్రాతతోలు మఱి వాహనమో ముదియెద్దు నీకుఁబెం
పెసఁగగ నాకు నేమిడుదు వెయ్యది నీకడ నున్నదయ్యా? సం
తసమున తావ కీన చరణ ద్వయ భక్తియె నిమ్ము శంకరా.

ఓదేవా! నేను యీ క్రింది లక్షణంబులు గలవాఁడ నగుదునేని నిను సేవింపఁజాలుదునని చెప్పు చున్నారు,

చ॥ జలనిధి సేతు బంధనము సల్పిన వీరుఁడనైతినేఁ గర
స్థలమునఁ బర్వతాధిపు న ధఃకృతిఁ జేసిన మేటి నైతినేఁ
జలజజు కన్న నెక్కుడని చాలఁ బ్రసిద్ధిని గంటినేని ని
న్నలర సపర్య సంస్తుతిని ధాన్యము జేయఁగనేర్తు శంకరా-

ఓ పరమేశ్వరా! నీకుఁబూజయును తాడనము గూడ ప్రియమైనవే కదా వానిలో నేది నీకెక్కువ ప్రీతికరమైనది. అని అడుగు చున్నారు.

చ॥ నతులును సంస్తవంబులు ఘ నంబగు ధ్యాన సమాధి పూజలం
చితముగఁజేయ సంతసము జెందక రోకటి పోటులఁ శిలా
హ తులను వింటి వ్రేటులను హర్షము సెంది తివంద్రుడు వీన నీ
మతికెది ప్రీతియో? తెలుపు మా?దయ యన్మై యొనర్తు శంకరా.

త్రికరణ శుద్ధిగా నిన్నె సేవింతు ననుచున్నారు.

చ ఆతులిత యోగధారణల యందు వివేకము లేని నేను సం
తతమును తింతు నీషుచరి తంబును మామక వాక్కుచే జగ
త్పతివగు నీ స్వరూపమును భక్తి భజింతు మనస్సుచే గృపాం
చితుఁడగు నిన్నె మచ్చిరము చేత నమస్కృతు లాచరించెదఁ.

మీ పాదార వింద ములనె సేవించెదనని నుడువు చున్నారు.

ఉ॥ మానుగనీ ప్రసాద మహిమంబున నాహృద యాంతరస్థితా
జ్ఞానము వాసె హృద్యమగు జ్ఞానము చిత్తమునందు రంజిలెఁ
మానిత మోక్షదాయకము మౌనిజనాభినుతంబు శ్రీకరం
బైన భవత్పదాబ్జ మన యంబెద గొల్చెద రాజశేఖరా.

ఓ సర్వేశ్వరా! నన్ని సంసార సాగరము నుండి దరిజేర్పు మనుచున్నా

మ॥ దురదృష్టంబును దుఃఖముఁ దురితముఁ దుర్మాన దుర్వాక్య దు
ర్భర మూఢత్వము వ్రాసినట్టి విధి దుర్వర్ణాళి నీ సత్కృపా
గరిమఁ దూరము చేరెనాదు నొసటఁ గౌరీశ! కీర్తింతు నీ
చరితంబున్నను నుద్ధరింపు మిక నీ జన్మంబునందే దయఁ.

నా చిత్తము పరమేశ్వరు నెడఁబాయకుండుఁగాకయని కోరుచున్నారు.

ఉ॥ సోమ కళావిభూషణుఁడు శోభనగాత్రుఁడు కోమలాంబు ద
శ్యామల కంధరుండు సుర సంయమి సంస్తవనీయుఁడుఁ జగ
త్స్వామియునౌ నుమారమణు భాసుర తేజమునందు నెప్పుడుఁ
మామక చిత్తమైక్యమయి మానితదివ్య సుఖంబులందు తఁ.